# ఆంధ్రపత్రిక

THE ANDHRA PATRIKA- MADRAS. సంపుటం 43. సంచిక 19 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO శుక్రవారం 20-4-1956 Reg. No. M. 1118. 6 పేజీలు 1 అణా


# ఆంధ్ర పంజాబుల ప్రాంతీయ సంఘాలపై రాష్ట్రపతి అజ్మాయిషీ

## అల్పసంఖ్యాకులకు మాతృభాషలో ప్రాథమిక విద్యాబోధనకు ఏర్పాట్లు

### ఉమ్మడి గవర్నర్లు, హైకోర్టులు: రాజ్యాంగం సవరణ బిల్లు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 18: వివిధ రాష్ట్రాలలోను వుండే భాషా అల్పసంఖ్యాక వర్గాలకు హామీ ఇవ్వడానికి రాజ్యాంగంలో 350 (ఎ) అని ఒక క్రొత్త అంశాన్ని చేరుస్తున్నారు.

ఈ అంశాన్ని బట్టి రాష్ట్ర ప్రభుత్వాలు, స్థానికాధికారులు కూడా, ఆ యా భాషలవారికి విద్యాబోధన సావకాశాలను విధిగా కల్పించాలి. ప్రాథమిక విద్య అంతా మాతృభాషలోనే కొనసాగే ఏర్పాట్లు చెయ్యాలి. ఇటువంటి ఏర్పాట్లను ఆ రాష్ట్రాలు చేస్తున్నదీ, లేనిదీ, పరిశీలించి, అట్లా చేయవలసిందిగా రాష్ట్రపతి ఆదేశాలను జారీ చేస్తూ వుంటారు. రాజ్యాంగం 9 వ సవరణ బిల్లు ద్వారా రాష్ట్రపతికి ఈ అధికారం కలిగిస్తారు.

రాజ్యాంగంలో 371 సూత్రాన్ని అనుసరించి 'బి' వర్గం రాష్ట్రాలమీద రాష్ట్రపతికి పర్యవేక్షణాధికారం దత్తంఅయివుంది. క్రొత్త వ్యవస్థీకరణంలో 'బి' వర్గం రాష్ట్రాలంటూ వుండవు గనుక రాష్ట్రపతికి ఈ అధికారాలుకూడావుండవు. అయితే ఆంధ్ర పంజాబు రాష్ట్రాల విషయమై మాత్రం అలాటి పర్యవేక్షణాధికారాన్ని రాష్ట్రపతికి ఇస్తూ ఒక క్రొత్తసూత్రాన్ని ఈ 9 వ సవరణబిల్లు రాజ్యాంగంలో చేరుస్తున్నది. ఈ సూత్రాన్ని అనుసరించి ఈరాష్ట్రాల శాసనసభల్లో ప్రాంతీయసంఘాలను ఏర్పాటు చేసీ, అవి సరిగ్గా పనిచేసేట్లు ప్రభుత్వ వ్యవహార సరళిని, శాసనసభల వ్యవహార సూత్రాలను సంస్కరిస్తూ వుండే అధికారం రాష్ట్రపతికి లభిస్తున్నది.

#### ఎగువసభ బలం

ఈ సవరణబిల్లులో రాష్ట్రాల శాసనాధికారాలను, శాసనసభల బలాబలాలను, పార్లమెంటుబలాన్ని, అధికారాలనుగూడా సంస్కరిస్తున్నారు. ఈ బిల్లులోని 9 వ అంశాన్ని పురస్కరించుకుని రాష్ట్ర శాసనసభల, ఎగువసభల బలం పెరుగుతుంది. పూర్వం ఇది దిగువ సభ సభ్యసంఖ్యలో ¼ మించి వుండరాదని వుంది. ఇప్పుడు 1/3 వుండాలి అని యీబిల్లు రాజ్యాంగాన్ని సవరిస్తున్నది.

#### లోక్ సభ ఏర్పాట్లలో సవరణలు

రాజ్యాంగంలో 81,82 అంశాలు లోక్ సభ ఏర్పాటు గురించి చెబుతున్నారు. ప్రతి జనాభా లెక్కల అనంతరం ఆ ఏర్పాట్లలో జరగవలసి వున్న మార్పులను గూడా ఈ అంశాలు నిర్దేశిస్తున్నాయి. లోక్ సభలో సభ్యుల సంఖ్య 500 మించరాదని ఎగువ సభకు అంటే రాజ్యసభకు కేంద్ర ప్రాంతాలనుంచి 20 మంది కన్నా ఎక్కువమందికి ప్రాతినిధ్యం కల్పించరాదని గూడా రాజ్యాంగం చెబుతున్నది. పోతే ప్రతి రాష్ట్రానికి ఇక్కడ స్థానాలు జనాభానుబట్టి కేటాయించబడతాయి. ఇప్పుడు జరుగుతున్న సవరణలను అనుసరించి కేంద్ర ప్రాంతాలను, రాష్ట్రాలను కలిపి కేంద్రనియోజక వర్గాలను ఏర్పాటు చేయడము పోతుంది. పూర్వం ఇట్టి యేర్పాటు ఉండేది. ఇప్పుడు క్రొత్త వ్యవస్థీకరణంలో రాష్ట్రాలు విపుల వైశాల్యం కలిగినవిగా ఉంటాయి గనుక, ఆ పాతి యేర్పాటు అనవసరమై పోతున్నది. ఈ విస్తృతమైన సవరణలనే రాష్ట్రాలలో గూడా పట్టించడానికి వీలుగా రాజ్యాంగంలో 170 అంశాన్ని గూడా మారుస్తున్నారు.

#### గవర్నర్లు

రాజ్యాంగంలో గవర్నర్ల నియామకాన్ని గూర్చివున్న 153-వసూత్రాన్ని గూడా ఇప్పుడు యీ బిల్లు సవరిస్తున్నది. ఇందుకు ఈ బిల్లులో 6-వ అంశం పనిచేస్తోంది. దీన్ని బట్టి రెండు, అంతకన్న అధికం రాష్ట్రాలకు కలిపి ఒకడే గవర్నరును నియమించవచ్చు. ఈ బిల్లులో ఎక్కడా రాజప్రముఖుల ప్రసక్తిలేదు. ఇక ఆ వ్యవస్థ వుండదు.

#### హైకోర్టులు, న్యాయమూర్తులు

## లండన్ కు రష్యన్ నాయకుల ఆగమనం

### అధికార స్వాగతం

లండన్, ఏప్రిల్ 18: సోవియట్ రష్యా ప్రధాని శ్రీ నికొలాయ్ బుల్గానిన్, కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి శ్రీ నికితా కృశ్చేవ్ ఇవాళ లండన్ చేరుకున్నారు. బ్రిటనులో 10 రోజులు పర్యటిస్తారు.

రష్యన్ నాయకులకు పోర్ట్సమత్ రేవులో పోర్ట్సమత్ మేయరు, బ్రిటిషు విదేశాంగ సహాయమంత్రి లార్డ్ రీడింగ్ స్వాగతమిచ్చారు. లండనులో విక్టోరియా రైల్వే స్టేషనులో బ్రిటిషు ప్రధాని సర్ ఆంథోనీ ఈడెన్ స్వాగతమిచ్చారు.

రష్యన్ నాయకుల పర్యటన సందర్భంలో బ్రిటన్లో ఎన్నడూ అక్కడి ప్రజలు వాని యెరుగనంతిగా రక్షణ బందోబస్తు ఏర్పాటయింది.

బ్రిటిష్ ప్రధానితో, రష్యన్ నాయకులు అంతర్జాతీయ సమస్యలపై దీర్ఘ సమాలోచనలు జరుపుతారు.

రష్యన్ నాయకులను తీసుకువచ్చిన సోవియట్ నౌక, దీని వెంట వచ్చిన రెండు సోవియట్ డిస్ట్రాయర్ నౌకలు తీరానికి నాలుగుమైళ్లలో ఉండగానే ఒక బ్రిటిష్ డిస్ట్రాయరు నౌక ఎదురువెళ్లి స్వాగత సూచకంగా 13 ఫిరంగులు కాల్చింది. స్వాగతం స్వీకరించినట్లు సోవియట్ నౌకలు తిరిగి ఫిరంగులు పేల్చాయి.

పోర్ట్సమత్ రేవులో సోవియట్ నౌకకు సైరన్లు స్వాగతం కూశాయి.

పోర్ట్సమత్ నుంచి లండన్ వరకూ దారి వెంట అడుగడుక్కీ రక్షణ ఏర్పాట్లు జరిగాయి. ఇంత బందోబస్తు ఏర్పాటును యిక్కడి ప్రజ లింతవరకెన్నడూ చూడలేదు.

రేవులో విలబడిన ప్రేక్షకులకు శ్రీ బుల్గానిన్, శ్రీ కృశ్చేవ్ తమ నౌకలో నుంచే హర్షసంకేతం చూపారు.

పాశ్చాత్యవర్గానికి చెందిన అగ్రరాజ్యాన్ని ఈ సోవియట్ నాయకులు దర్శించడం ఇది మొదటిసారి.

ప్రచ్ఛన్న యుద్ధాన్ని నివారించి అభిప్రాయభేదాలను పరిష్కరించడానికి అనేక విఫలయత్నాలు జరిగిన తరువాత ఈ పర్యటన ఏర్పాటయింది.

సోవియట్ నాయకులు నౌక దిగి రేవు చేరగానే బ్రిటిష్ నౌకా వాద్యబృందం సోవియట్ జాతీయగీతం వినిపించింది. బ్రిటిష్ నౌకాధిపతి సర్ జార్జ్ క్రీజీ వెంటరాగా ఈ నాయకులు బ్రిటిష్ నావికుల సైనికాభివందనం స్వీకరించారు. రేవులో బ్రిటిష్ విమానవాహకనౌక 19 ఫిరంగులు కాల్చింది.

సైనికాభివందనం జరిగిన వెంటనే స్వాగతవాక్యాలవంటి లాంఛనాలతో నిమిత్తం లేకుండా తొందర తొందరగా రష్యన్ నాయకుల్ని తుపాకి గుళ్లు దూరని మోటార్లలో స్టేషనకి బయలుదేరదీశారు.

విక్టోరియా స్టేషన్లో సోవియట్ నాయకులకు స్వాగతమిస్తూ బ్రిటిషు ప్రధాని సర్ ఆంథోనీ ఈడెన్ ఉభయ దేశాలకూ ప్రమేయంకల విషయాలను, ప్రపంచశాంతి సౌభాగ్యాలను చర్చించగలరని చెప్పారు. కిందటి వేసవిలో జెనీవా అగ్రరాజ్య సమావేశం తరువాత అనేక పరిణామాలు వచ్చాయన్నారు. ఇక్కడి చర్చలఫలితంగా ఈ రెండు దేశాల ప్రభుత్వాలూ ప్రజలమధ్య సన్నిహితభావం పెంపొందగలదని శ్రీ ఈడెన్ ఆశ ప్రకటించారు.

శ్రీ బుల్గానిన్ శ్రీ ఈడెనకు కృతజ్ఞత తెలుపుతూ, బ్రిటిషురాణి, ప్రభుత్వం ప్రజలపట్ల సోవియట్ ప్రభుత్వం, ప్రజల సుహృద్భావం ప్రకటించారు. బ్రిటను సాధించిన సంస్కృతి, విజ్ఞాన శాస్త్రం, సాంకేతిక విద్యల అభివృద్ధికి సోవియట్ ప్రజల ప్రశంసలు అందజేశారు. బ్రిటనుతోనే కాక అమెరికా, ఫ్రాన్సు తదితర దేశాలతో కూడా రష్యా స్నేహ సంబంధాలు పెంపొందించగలరదని ఆశ తెలిపారు.

ఉభయదేశాల ప్రజల క్షేమంకోసం విశ్వశాంతికోసం ఈ రెండు దేశాల మధ్య స్నేహభావం పెంపొందడం అవసరమన్నారు. ఇదికొంతమటుకు సాధించారు. ఇంకా సాధించవలసింది చాలా ఉందన్నారు. అయితే అది సులభసా

4 వ పేజి 3 వ కాలంచూడుడు

## బాండుంగ్ మహాసభ సత్ఫలితాలు

### ఆసియాఫ్రికా రాజ్యాలకు ఇతోధిక స్వాతంత్ర్యం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 18: బాండుంగ్ మహాసభ విశ్వశాంతిస్థాపనకు జరిగిన ఉత్తమ మానవప్రయత్నమని కొన్ని ఆసియాఫ్రికారాజ్యాలు స్వాతంత్ర్య సంపాదనకృషిలో చాలావరకు కృతకృత్యులైనాయని శ్రీ వి. కె. కృష్ణమీనన్ నేడు బాండుంగ్ సభ వార్షికోత్సవ సందర్భంలో ప్రసంగిస్తూ అన్నారు.

ఇండోనేషియా రాయబార కార్యాలయంలో యీ సభ జరిగింది. ప్రభుత్వము, ప్రజలు కూడా యీ వార్షికోత్సవాలలో పాల్గొంటున్నందుకు శ్రీ మీనన్ హర్షం వెలిబుచ్చారు. ఐదు ఖండాలలో రాజ్యాల ప్రతినిధులు యిందులో పాల్గొని, బాండుంగ్ సభావిశేషాలను ప్రస్తావించారు.

శ్రీ మీనన్ మాట్లాడుతూ ఈ సభ జరిగినప్పటినుంచి ఆసియా ఆఫ్రికాలలో చెప్పుకోదగిన సంఘటనలు చాలా జరిగాయన్నారు. మొరాకో, ట్యునీషియా, సుడాన్లకు స్వాతంత్ర్యం లభించిందని చెప్పారు. మలయా, గోల్డుకోస్టు స్వాతంత్ర్య పథంపైపు పురోగమిస్తున్నవన్నారు.

బర్మా రాయబారి మాట్లాడుతూ సైనిక సంధులు, కూటాలు, బాండుంగుసభ లక్ష్యాలకు విరుద్ధమన్నారు. ఇండోనేషియా రాయబారి పంచశీల ప్రాధాన్యం పేర్కొన్నారు.

పాక్ హైకమిషనరు శ్రీ గజ్నఫరాలీఖాన్ ప్రసంగిస్తూ రాయబారాలు, మధ్యవర్తిత్వం ద్వారా వివాదాస్పద సమస్యలు పరిష్కరించుకోవాలన్నారు.

### జమాబందీ వాయిదా

#### తెనాలి డిప్యూటీ కలెక్టరు ఉత్తర్వు

తెనాలి, ఏప్రిల్ 17: ఈ రోజు నుంచి జరుగవలసివున్న జమాబందీని వాయిదా వేస్తూ డిప్యూటీ కలెక్టరు ఉత్తర్వుచేశారు. రైతులకు యిబ్బంది, కలుగకుండా దరఖాస్తుల పరిశీలన జమాబందీని మాత్రం జరుపుతారు.

డిప్యూటీ కలెక్టరు వుత్తర్వుపట్ల తాలూకా గ్రామోద్యోగియ సంఘ సర్వసభ్య సమావేశంలో హర్షం ప్రకటించారు. మామూలు జమాబందీని జూన్ ఆఖరువరకు వేయాలని కోరారు. రెవిన్యూమంత్రి యీ నెల 22 న యిక్కడకు వచ్చే సందర్భంలో రాయబారం వెళ్లాలని నిశ్చయించారు.

సమావేశానికి శ్రీ ఆవుల వెంకటరత్నం అధ్యక్షత వహించారు. శ్రీ ఆవుల గోపాలకృష్ణమూర్తి సలహాపై తీర్మానాలు చేశారు.

### భారత-పాక్ సరిహద్దుల్లో త్రవ్వకాలు

#### లోక్ సభలో ప్రస్తావన

న్యూఢిల్లీ, ఏప్రిల్ 18: భారత, పాకిస్థాన్ సరిహద్దుల్లో ఫజిల్కా దగ్గర పాకిస్థానీలు త్రవ్వకంపనులు జరిపిస్తున్న మాట నిజమేనని విదేశాంగశాఖ పార్లమెంటరీ కార్యదర్శి శ్రీ సాదత్ అలీఖాన్ నేడు లోక్ సభలో ధృవపరిచారు. ఈ త్రవ్వకాలు నీటిపారుదల కోసం జరుగుతున్నవో, ఇతర అవసరాలకోసం జరుగుతున్నవో మాత్రం తెలియలేదని ఆయన అన్నారు.

ఈ త్రవ్వకాలు సరిహద్దులకు 500 అడుగులదూరంలో, పాకిస్థాన్ భూభాగంలోనే జరుగుతున్నవని ప్రధాని నెహ్రూ వివరించారు. ఈ త్రవ్వకాల వల్ల మనకు అట్టే జరిగే జేమీ లేదని ఆయన అభిప్రాయం వెల్లడించారు.

### కాందిశీకులకు ప్రవేశానుమతులు

కలకత్తా, ఏప్రిల్ 18: తూర్పు పాకిస్తానునుంచి భారతదేశానికి రాగోరే కాందిశీకులకు అనుమతు లివ్వటంలో నిర్బంధాలు విధించబడుతున్నవనే ఆరోపణలను పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రి డా॥ బి. సి. రాయ్ నేడు విలేఖరుల గోష్టిలో ఖండించారు.

కాందిశీకులు సరిహద్దులు దాటే ముందే పునరావాసపు ఏర్పాట్లు చేసే నిమిత్తం, కాందిశీకులను గురించి వివ

### స్పెయిన్లో రాజరికం

#### విదేశాంగ మంత్రి సుముఖత

## సోషలిస్టులతో కమ్యూనిస్టులు సహకరించాలని నిర్ణయం

### ప్రపంచ పరిస్థితులు మారినందువల్ల కొమిన్ ఫారం రద్దు

మాస్కో, ఏప్రిల్ 18: కొన్ని ఏళ్లుగా అంతర్జాతీయ వ్యవహారాలలో మార్పులు వచ్చినందువల్ల, అనుకున్నపని తీరినందువల్ల కొమిన్ఫారంను రద్దుపరిచినట్లు, ఆ సంస్థలో సభ్యత్వం కలదేశాల కేంద్ర కమ్యూనిస్టు సంఘాలన్నీ కలిసి సంయుక్త ప్రకటన చేశాయి.

కార్మికవర్గంలో చీలికలు వచ్చాయనీ, తిరిగి ఈ వర్గంలో ఐక్యతను, సోషలిస్టుల సహకారాన్ని సాధించవలసిన అవసరం వున్నదని ఈ ప్రకటన తెలుపుతోంది.

(కొమినుఫారం రద్దయినట్లు రష్యా ఉపప్రధాని శ్రీ అనాస్తాస్ మికోయాన్ నిన్న రాత్రి చేసిన ప్రకటన పత్రికలో ప్రచురితమైనది.)

కొమినుఫారం (అంతర్జాతీయ కమ్యూనిస్టు సమాచార సంస్థ)లో బల్గేరియా, హంగేరి, ఇటలీ, పోలండ్, రుమేనియా, రష్యా, చెకొస్లొవాకియా, ఫ్రాన్సు కమ్యూనిస్టు పార్టీలు సభ్యులు.

ఇప్పుడీదేశాల జాతీయ కమ్యూనిస్టు సంఘాలు-సంస్థను రద్దు పరచడానికిగల కారణాలు ఈక్రిందివని వివరించాయి.

1. గత కొన్ని యేళ్లుగా అంతర్జాతీయ పరిస్థితులలో వచ్చిన మార్పులు.

2. సామ్యవాదం ఇదివరలో ఒకదేశంలో అమలులో ఉండేది. ఇప్పుడు అనేక దేశాలలో అదికూడా ఒక వ్యవస్థగా రూపొందింది.

3. యూరప్ ఆసియాలలో సామ్యవాద దేశాలు, కొన్ని ఇతర దేశాలు కలిసి శాంతి ప్రాంతంగా ఏర్పడి, ఆ దేశాల మధ్య మైత్రి ఏర్పడింది.

4. ధనిక వాద, పరాధీన, వలసదేశాలలోని కమ్యూనిస్టుపార్టీలు బాగా బలపడ్డాయి. ఆపార్టీలు మరింత చురుకుగా యుద్ధ, అభ్యుదయ నిరోధక శక్తుల్ని నిరోధించి, శాంతి స్వాతంత్ర్యాలను సాధించడానికి కృషి చెయ్యగలుగుతున్నాయి.

5. కార్మికోద్యమాలలో వచ్చిన చీలికలనుపోగొట్టి, ఐక్యత సాధించి, శాంతి సామ్యవాదాలకోసం పోరాడవలసిన ఆగత్యం.

ఇవీ కారణాలు.

ఇది రద్దయిపోయినప్పటికీ కమ్యూనిస్టుపార్టీలు, కార్మికపక్షాలు తమతమ దేశాలలో పరిస్థితుల్నిబట్టి స్వయంగా విచక్షణ చూపుతూ ఉద్యమాలు నడుపుకుంటూ, పరస్పరం అభిప్రాయాలు తెలుసుకోవచ్చునని ఈ ప్రకటన వివరించింది.

అందరికీ సంబంధించిన సమస్యలు శాంతి ప్రజా స్వామ్యం, సామ్యవాదాల సాధన సమస్యలు, కార్మికుల క్షేమం, యుద్ధవ్యతిరేక సంఘటన ఈ మొదలైనసాగిఅంశాలపై పరస్పర సమాలోచనలు చర్చలు అంచుకోవచ్చు. దీనితోపాటు కమ్యూనిస్టుపార్టీలు పరస్పర సహకారం, సామ్యవాద లక్ష్యానికి కృషిచేసే ఇతర పక్షాలతో సహకారం సాధించడానికి ప్రయత్నం చెయ్యాలి. శాంతి ప్రజా స్వామ్యాలను సుస్థిర పరచగోరే ఇతర పక్షాల సహకారంకూడా సాధించాలి.

మొదట యీ సంయుక్త ప్రకటన కొమిన్ఫారం ఏ ఉద్దేశంలో స్థాపించారో వివరించింది. కొమింటర్న (అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థ) 1943 లో

4 వ పేజి 8 వ కాలం చూడుడు

### సమితి కార్యాలయంలో వివిధ భావాలు

సమితి కార్యాలయం, ఏప్రిల్ 17: రష్యన్ నాయకులు బ్రిటన్ పర్యటన ప్రారంభించడానికి సరిగ్గా ముందే కొమిన్ఫారంరద్దయినట్లు వచ్చిన ప్రకటనపట్ల ఇక్కడ వివిధదేశాల ప్రతినిధులు రకరకాల అభిప్రాయాలు తెలియజేశారు.

యుగోస్లావ్ ప్రతినిధులు సంతృప్తి ప్రకటించారు. "ఇదో చాకచారు తంతుమాత్రమే" అని అమెరికన్ల అభిప్రాయం. టిటో (యుగోస్లావ్ అధ్య

4 వ పేజి 8 వ కాలం చూడుడు

## ధనికులమూ యజమానులమూ అయిపోవాలనే ఆశ కూడదు

### వినోబాజీ శ్రీరామనవమి సందేశం

(స్వకీయ విలేఖరి)

ప్రొద్దుటూరు, ఏప్రిల్ 18: "సరిగా అయిదు సంవత్సరాల క్రితం భూదాన ఉద్యమం ప్రారంభమైంది. రేపటితో 6 వ సంవత్సరం ప్రారంభమవుతుంది. యీ ఉద్యమాన్ని శ్రీరామనవమి ముందురోజున ప్రారంభించాము. మళ్లీ శ్రీరామనవమి వచ్చింది. శ్రీరామచంద్రుడు నిరంతరం ప్రజల సేవచేస్తూ ఉండేవాడు. మనం కూడా నిరంతరం సేవలో నిమగ్నులం కావాలి. ధనికులమూ యజమానులమూ అయిపోవాలనే ఆశపోవాలి. మన భావాలు, ప్రవృత్తులు రామమయం కావాలి." అని వినోబాజీ దేవగుడిలో ప్రార్థనా సమావేశంలో అన్నారు.

ఆచార్యజీ ఇలా ప్రసంగించారు: "ప్రతి దినం వేర్వేరు గ్రామాలకు వస్తున్నాము. పరమేశ్వరుడు ప్రసన్నుడవుతున్నాడు. ప్రజలు మమ్మల్ని ప్రేమించి

## పాశ్చాత్య ఆర్థిక సిద్ధాంతాల ఉచ్చుల్లో పడకండి

### భారతీయులకు బ్రిటిష్ సోషలిస్టు ఆర్థికవేత్త సలహా

హైదరాబాద్, ఏప్రిల్ 19: పాశ్చాత్య ఆర్థిక సిద్ధాంత ఛాందసాల ఉచ్చుల్లో పడకుండా, దేశ స్థితిగతులనుబట్టి స్వయంగా మిశ్రమ ఆర్థిక విధానాన్ని అనుసరించవలసిందని ప్రసిద్ధ బ్రిటిష్ సామ్యవాద ఆర్థికవేత్త శ్రీ జాన్ స్ట్రాచీ భారత ఆర్థికశాస్త్ర సంస్థ ఏర్పాటుచేసిన ద్వితీయ పంచవర్ష ప్రణాళిక సదస్సులో ప్రసంగిస్తూ సలహా ఇచ్చారు.

ఆహార వస్త్రాల ధరలను సుస్థిరపరిచి భారత ప్రభుత్వం ద్రవ్య లోపాన్ని కరెన్సీ అచ్చుద్వారా భర్తీచేసి, ఆర్థిక ప్రణాళికను అమలు జరిపినట్లయితే, భారతదేశం ఆర్థిక విజ్ఞాన శాస్త్రంలో క్రొత్త విధానం రూపొందించిన దౌతుందని అమెరికా ఆర్థిక శాస్త్రవేత్త శ్రీ జె. కె. గల్ బ్రెయిత్ చెప్పారు.

ఈ ఆర్థిక శాస్త్రజ్ఞు లిద్దరినీ ద్వితీయ పంచవర్ష ప్రణాళికను పరిశీలించి, సలహా ఇవ్వడం కోసం భారత ప్రభుత్వం ఈ దేశం రప్పించింది.

బ్రెయిత్ ప్రణాళికకు అవసరమైన ఖర్చు కోసం ఆదాయలోపాన్ని కరెన్సీనోట్లు అచ్చువేసి భారతదేశం కార్యం సాధించినట్లయితే, ఆర్థిక విజ్ఞానశాస్త్రంలోనే క్రొత్తవిధానాన్ని రూపొందించిన దౌతుందన్నారు.

పెద్దపెట్టున ప్రణాళిక తయారుచేసి ప్రభుత్వం వివేకం చూపింది. కాని సాధించేది అల్పమైతే మాత్రం అది ఘోర విషాదంగా పరిణమిస్తుంది.

పాశ్చాత్య దేశాలనుంచి యంత్ర పరికరాలు లభ్యంకావటంలో జాప్యం కావచ్చును. ధరల పెరుగుదల (ద్రవ్యోల్బణం) మితిమీరకుండా ఆహారవస్త్రాల ధరలను అదుపులోఉంచి సుస్థిరపరచడం అవసరం. ఈ విషయంలో మొదటి

(4 వ పేజీ 6 కాలం చూడుడు)

బహిరంగ ప్రకటన

ఆంధ్ర ప్రభుత్వము

విద్యుచ్ఛక్తి శాఖ, ఆంధ్ర పవర్ సిస్టమ్

రాజమండ్రి ఎలక్ట్రిక్ సప్లయ్ కార్పొరేషన్ లిమిటెడ్, రాజమండ్రి, విద్యుచ్ఛక్తి సంస్థ స్వాధీన పర్చుకోవటం.

ఆంధ్ర విద్యుచ్ఛక్తి సప్లయి సంస్థల (స్వాధీనపు) చట్టము 1954, మరియు 19-10-55 తేదీ గల జి.ఓ. నెం. 2100, ఆంధ్ర ప్రభుత్వ ప్రకటన 10-4-56 తేదీ గల జి. ఓ. ఎమ్మెస్. నెం. 1015 పి. డబ్ల్యు & టి. డిటి లలోను, తరువాత ఉత్తర్వుల ప్రకారం రాజమండ్రి లోని విద్యుచ్ఛక్తి సంస్థ 20-4-56 తేదీన, మరి ఆ తేదీనుండి ఆంధ్ర ప్రభుత్వ విద్యుచ్ఛక్తి శాఖ స్వాధీన మవుతుందని రాజమండ్రి ఎలక్ట్రిక్ సప్లయ్ కార్పొరేషన్ లిమిటెడ్ వారి ద్వారా విద్యుచ్ఛక్తి వాడకం దారులతో సహా, అందరికి యిందు మూల ముగా తెలియజేయటమైనది. అన్ని వర్కుషాపు, స్టోర్సు, ఆస్తులు, స్థిర, చర ఎక్విప్‌మెంటులు, సంస్థలో భాగమైన టూల్సు, ప్లాన్టులు, లారీలు, లైనులు, సబ్-స్టేషనులు, పవర్ స్టేషనులు, సర్వీసులు, మీటర్లు, వీధిదీపాల ఫిట్టింగులు, టెస్టింగ్ ఎక్విప్‌మెంటు, మరియు అన్ని చెట్లు, ఫెన్సులు, కంచెలు, ఉగ్రాణాలు, నీటిబదులు, మార్గపు హక్కులు, సహా ఇతర ఆస్తులు, మరియు పై సంస్థకు చెందిన లేదా మరేవిధంగానైనా సంబంధించిన లేదా చెందినవని తెలియవచ్చిన ఉపకరణములు పూర్తిగా, ఎల్లప్పుడూ, ఎట్టి శాకట్టుల తో నిమిత్తము లేకుండా ఆంధ్ర ప్రభుత్వము స్వాధీనమై ఉండును.

2. విద్యుచ్ఛక్తి సంస్థను తీసుకున్న తేదీనుండి, అది సూపరింటెండింగ్ ఇంజనీర్, ఆంధ్ర పవర్ సిస్టమ్, విజయవాడ, వీరపాలనా ఆధ్వర్యంలోకి వస్తుంది.

3. విద్యుచ్ఛక్తి సప్లయికి సంబంధించిన అన్ని ఉత్తర ప్రత్యుత్తరాలు స్థానిక అసిస్టెంటు ఇంజనీర్, ఆక్విజిషన్, పవర్ హౌస్, రాజమండ్రి, వారి పేర వ్రాయవచ్చును.

4. విద్యుచ్ఛక్తి సప్లయ్ ఛార్జీలు, సంస్థకు రావలసిన ఇతర బాకీలు, పవర్ హౌస్, రాజమండ్రి, దగ్గర గల విద్యుచ్ఛక్తి శాఖ ఆఫీసుకు చెల్లించవలసి ఉంటుంది.

టి. నారాయణరావు,
సూపరింటెండింగ్ ఇంజనీర్,
ఆంధ్ర పవర్ సిస్టమ్.

# విడుబ్రోలులో మసూచి

## మరి 7 గురికి సోకింది

విడుబ్రోలు, ఏప్రిల్ 18: ఈ గ్రామానికి ఈ మధ్యలోని చెలిబేవర్ ప్రాంతంలో మరి 7 గురికి మసూచి సోకింది. అంటే ఇంతవరకు మొత్తం 9 మందికి అక్కడ ఈ వ్యాధి వచ్చిందన్న మాట. వ్యాధి ఇతర ప్రాంతాలకు ప్రబలకుండా తగు ఏర్పాట్లు జరుగుతున్నవి.

# మదరాసు ధరలు

మదరాసు, ఏప్రిల్ 19:

బంగారు వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు పవరను 1-కి ఎప్పర్డు బొమ్మ సేల్సుటాక్సుతో సహా రు. 66-12-0

పెట్టి బంగారం తులం రు. 106-8-0

మూస బంగారు రు. 105-8-0

సీమవెండి తులం100కి రేడీ రు. 182-0-0

చిల్లర ధర రు. 1-14-0

వేరుశనగ

(531 పౌ॥ 1-కి ఎక్సుకోష్టా గిడ్డంగులు మెషిన్ సేల్సుటాక్సుతో సహా

డిసెంబరు రు. 166-164

వేరుశనగనూనె ఎక్సు పెల్లర్ మిల్లో 3% 500పౌ.) రెడీచిల్లరధర 315

కొంకాయనూనె (87½ పౌనులు సేల్సుటాక్సు అదనం

అంబుమార్కు రు. 26-0-9

ఎం. ఎస్. బ్రాండ్ డబ్బా 26-8-9

రాజా రు. 25-12-9

# న్యూయార్కు దూది

## జూలై వాయిదా ధరలు

న్యూయార్కు, ఏప్రిల్ 18: న్యూయార్కు, కాటన్ మార్కెట్ ధరలు ఈ క్రింది విధంగా ఉన్నవి:

నేటి ప్రారంభ ధర 33.00

నేటి ముగింపు ధర 32.95

హిందుస్థాన్ సైంటిఫిక్ ఇండస్ట్రీస్ (ప్రైవేట్) లిమిటెడ్, మచిలీపట్టణము

పై కంపెనీ మేనేజిమెంట్ లో ఉన్న శ్రీ వి.ఎస్.ఎన్.శర్మ,బి.ఎస్.సి, కంపెనీని వదిలివేశారు; ఎక్కడున్నది తెలియదు. కంపెనీకి సంబంధించిన వ్యవహారం ఏమీ వారితో ఎవరూ పెట్టుకోరాదని, క్రింద సంతకము చేసిన వారితోనే అన్ని వ్యవహారాలు జరపాలని తెలియజేస్తున్నాము.

జె. మాణిక్యాలరావు,
చైర్మన్, డైరెక్టరుల బోర్డు.

టెండరు నోటీసు

ఈ క్రింది పనికి 30వ ఏప్రిల్ 1956 లోగా సీలువేసిన టెండరులు కావలెను.

(1) పశ్చిమ గోదావరిజిల్లా పెనుగొండ గ్రామంలోని ఆర్. ఎస్. నెం. 301/2 చెరువు గర్భం, (పూడుకుపోయిన చెరువు భాగము) భూములలోని మట్టి త్రవ్వి ఎత్తు చేయుట, లెవెల్ చేయుట-ఎస్టిమేటు మొత్తము రు. 17,500. బయానా సొమ్ము రు. 875.

పూర్తి వివరాలకు కరెస్పాండెంటు, జడ్. ఎన్. వి. ఆర్. హైస్కూలు, పెనుగొండ, పశ్చిమ గోదావరిజిల్లాకు వ్రాయవలెను.

నూలి లక్ష్మీనారాయణ, కరెస్పాండెంటు.
జడ్. ఎన్. వి. ఆర్. హైస్కూలు,
పెనుగొండ, 16-4-56.



# పలుచోట్ల ప్రణాళికోత్సవాలు

## గ్రామస్థుల ఉత్సాహం

కర్నూలు, ఏప్రిల్ 17: ఉలిందకొండ గ్రామంలో జాతీయ విస్తరణ ప్రణాళిక వారోత్సవం జయప్రదంగా ముగిసింది. శ్రీ వి. లక్ష్మీనరసయ్య నాయకత్వాన ఉపాధ్యాయులు బాలబాలికలు గ్రామాభ్యుదయ ప్రచారం చేశారు. శ్రీ కె. అయ్యపురెడ్డి బహిరంగ వరిసాగు, ఎరువులపాతి పద్ధతిని గురించి వుపన్యసించారు. పిల్లల ఆటల పోటీలు జరిగాయి. శ్రీ శంకరనారాయణ పోటీని నిర్వహించారు. శ్రీ కె. వీరరాఘవరెడ్డి బహుమతులు పంచారు.

ఒంగోలు

ద్వితీయ ప్రణాళికా వారానికి శ్రీ యల్. మాలకొండయ్య ప్రారంభం చేశారు. శ్రీ బి. రామకృష్ణారెడ్డి ప్రసంగిస్తూ ద్వితీయప్రణాళికాంశాలు ప్రస్తావించారు.

కానుమోలు

ద్వితీయ ప్రణాళికావారాన్ని 2వ తేదీన ప్రారంభించారు. ఊరేగింపు తరువాత హరిజనవాడలను శుభ్రపరిచారు. శ్రీ నూకల సీతారామస్వామి, శ్రీనూకల వీరరాఘవయ్య పాల్గొన్నారు. వయోజనులకు సందర్శించారు. విద్యార్థులు యోగాసనాలు ప్రదర్శించారు. సాయంత్రం శ్రీ వీరరాఘవయ్య అధ్యక్షతన సభజరిగింది. శ్రీ ఎస్. వి. ఎల్. నరసింహారావు వయోజన విద్యపై ప్రసంగించారు. శ్రీ ప్రతిపాటి ఆదినారాయణ హరిజనాభివృద్ధి కార్యకలాపాలు వివరించారు. శ్రీ నూకల సీతారామస్వామి గ్రామస్థులు శ్రమదానం చేయగలరని హామీ ఇచ్చారు.

నరసరావుపేట

ద్వితీయ ప్రణాళికావార సందర్భములో యీ నెల 8వ ఎ. సి. సి. సైనిక వందనం జరిగింది. శ్రీ ఐ. రంగనాయకులు వందనం స్వీకరిస్తూ విద్యార్థులు ఎక్కువగా సైనికశిక్షణ పొందాలని సూచించారు. శ్రీ వి. వెంకట్రావు, శ్రీ యన్. సి. అంజనేయులు ప్రసంగించారు.

శ్రీ పడింపల్లి హనుమంతరావు అధ్యక్షతన 1వ తేదీన ప్రణాళికావారానికి ప్రారంభం జరిగింది. శ్రీ కపిలవాయి కాశీ రామారావు మహమద్ మొహిదీన్ ఉపన్యసించారు.

వాయల్పాడు

ప్రణాళికావార ప్రారంభ సందర్భంలో దివిటీల వూరేగింపు జరిగింది. విద్యార్థులు, ఉపాధ్యాయులు హరిజనవాడలలో శ్రమదానంచేశారు. సాయంత్రము బహిరంగసభ జరిగింది. నృత్య వినోద ప్రదర్శనాలు జరిగాయి.

కుప్పగల్లు

కార్మికపాఠశాల ఆవరణలో ప్రణాళికావారానికి ప్రారంభం జరిగింది. శ్రీ టి. జి. తిమ్మయ్యశెట్టి అధ్యక్షత వహించారు. శ్రీ సత్యనారాయణ ప్రణాళికావార ప్రాముఖ్యం వివరించారు. శ్రీ పి. నారాయణరెడ్డి మాట్లాడుతూ గ్రామస్థుల అవసరాలను తీర్చుకోవడానికి బ్లాక్ అభివృద్ధి శాఖతో సహకరించాలని కోరారు. శ్రీ కొండలరావు గేయాలు గానం చేశారు. శ్రీ హెచ్. వెంకటేశ్వరరావు బహుమతులు పంచారు. పిల్లలను పాఠశాలలకు పంపాలని, సోమరులుగా తిరుగనివ్వరాదని సూచించారు.

తాడేపల్లిగూడెం

ద్వితీయ పంచవర్ష ప్రణాళికా మహోత్సవ సందర్భముప 7వ తేదీ ఉదయం గణపవరం జాతీయ విస్తరణ ప్రణాళిక సిబ్బంది ఆధ్వర్యాన ఆటల పోటీలు రాత్రి జరిగినవి, శాసనసభ్యులు శ్రీచింతలపాటి వరప్రసాదమూర్తి రాజు అధ్యక్షతన బహిరంగసభ జరిగింది. శ్రీ కె. సింహాచలరాజు, శ్రీ మూర్తిరాజు మొదటి పంచవర్ష ప్రణాళిక కాలంలో సాధించిన ఫలితాలను వివరిస్తూ, ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో సాధించవలసిన కార్యక్రమాలను వివరించారు. ప్రజా సహకారం అవసరమని విజ్ఞప్తిచేశారు. పాఠశాల విద్యార్థినులు జాతీయగీతాలు, జానపదగీతాలు పాడారు. నృత్యప్రదర్శన చేశారు.

రామచంద్రపురం

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక వార ప్రారంభోత్సవ సందర్భమున 6వ తేదీన బోర్డు సెంట్రల్ హైస్కూలు విద్యార్థులు, ఉపాధ్యాయులు ఏ.సి.సి. దళం, ప్రణాళికా ప్రాముఖ్యం బోధించే నినాదాలతో ఊరేగింపు జరిపారు. ఉదయం జిల్లా మునసబు మహమ్మద్ ఖాదర్ ఖాన్ జాతీయ పతాకం ఎగురవేశారు. ఏ. సి. సి. దళంవారి వందన స్వీకారంచేశారు.

జగ్గయ్యపేట

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక సప్తాహ సందర్భంలో క్లబ్ ఆవరణలో జరిగిన మహాసభకు పంచాయతీ అధ్యక్షులు యస్. విశ్వనాథంగారు అధ్యక్షత వహించారు.

పంచవర్ష ప్రణాళిక వివరములు, విద్య, గ్రంథాలయములు సారస్వతికలను గురించి బోర్డుహైస్కూలు ప్రధానోపాధ్యాయులు బి. వి. శర్మగారు వుపన్యసించారు. వారంరోజులు జరిగిన ఆటలపోటీలలో గెలుపొందినవారికి, బహుమతులు పంచారు. పసుప్రదర్శనలో ప్రథమ బహుమతి తీసుకున్నది గిత్తదూడలకు, రెండవ బహుమతి

# "ఉత్తమ పౌరులనుమాత్రం తయారు చెయ్యండి"

## ఉపాధ్యాయులకు ముఖ్యమంత్రి సలహా

వెంకటేశ్వరపురం, ఏప్రిల్ 16: ఉపాధ్యాయుల కోరికలను ప్రభుత్వం నెరవేర్చలేక పోయినా వారు మాత్రం తమ విధులను సక్రమంగా నిర్వర్తించి విద్యార్థులను ఉత్తమ పౌరులుగా తయారుచేసి దేశకళ్యాణానికి దోహదమివ్వాలని ఈ నెల 13న ఇక్కడ జరిగిన సభలో ముఖ్యమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి సలహా చెప్పారు.

అన్నవరపు పేట నుంచి ముఖ్యమంత్రి ఈ నెల 13న ఇక్కడికి రాగా పంచాయతీబోర్డు అధ్యక్షుడు శ్రీ సూర్యచంద్రరావు, ఉన్నత పాఠశాల ఉపాధ్యాయులు తదితర పౌరులు స్వాగతం చెప్పారు.

శ్రీ అల్లూరి బాపినీడు అధ్యక్షతన జరిగిన సభలో పంచాయతీ బోర్డు తరపున, ఉపాధ్యాయుల తరపున ముఖ్యమంత్రికి స్వాగత పత్రాలను సమర్పించారు. సన్మానానికి కృతజ్ఞత చెబుతూ 1936లో తాము మాచినప్పటి కంటె యీ గ్రామం చాలా మారిందని ముఖ్యమంత్రి అన్నారు. దేశాభివృద్ధి కార్యక్రమంలో యీ గ్రామం కూడా సముచిత పాత్ర నిర్వహించుతుందని ఆశించుతూ ఉపాధ్యాయుల కోరికలను తీర్చగల స్థితిలో ప్రభుత్వం లేనందుకు విచారం ప్రకటించి విధులను సక్రమంగా నిర్వర్తించవలసి సలహా చెప్పారు.

### కొయ్యలగూడెం విద్యార్థి వసతి గృహం

కొయ్యలగూడెం, ఏప్రిల్ 16: ఈ పూళ్ళోని గిడా గరటయ్య బోర్డు ఉన్నత పాఠశాల హరిజన విద్యార్థి వసతి గృహం కొత్త భవనానికి ముఖ్యమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి ఈ నెల 12న ప్రారంభోత్సవం చేశారు.

శ్రీయుతులు మూల్పూరి రంగయ్య, అల్లూరి బాపినీడు, కృష్ణావతారం మొదలైనవారు సమావేశానికి వచ్చారు. పాఠశాల సహాయ సైనిక దళం ముఖ్యమంత్రికి వందనం సమర్పించారు. దళాధిపతి శ్రీ టి. మహాదేవశాస్త్రి, శ్రీ టి. అగస్టిన్ ముఖ్యమంత్రికి స్వాగతం చెప్పారు. బాలభటుల తరఫున శ్రీ యడవల్లి సూర్యనారాయణ ముఖ్యమంత్రికి స్వాగతం చెప్పారు.

శ్రీ పుసులూరి కోదండరామయ్య అధ్యక్షతన జరిగిన సభలో ఉపాధ్యాయసంఘ కార్యదర్శి శ్రీ జి. రామారావు, తెలుగు పండితుడు శ్రీ ఎమ్. పురుషోత్తం ముఖ్యమంత్రికి స్వాగతపత్రాలు సమర్పించారు.

ప్రభుత్వం అమలుజరిపిన అభివృద్ధి కార్యక్రమాలను వివరించుతూ ముఖ్యమంత్రి ప్రసంగించారు. పాఠశాల చరిత్రను వివరించి, దాతలు శ్రీమతి వెంకటనరసమ్మ, శ్రీయుతులు విశ్వేశ్వరరావు, గొమ్మెట రంగారావు, బండి శ్రీహరిరావు నాయుడు, కీ॥ శే॥ జొన్నలగడ్డ వీరన్న, కె. సత్యనారాయణ, వేములపల్లి సత్యనారాయణ, శ్రీమతి కె. బాపనమ్మ మొదలయిన వారికి కృతజ్ఞత చెపుతూ ప్రధానోపాధ్యాయుడు శ్రీ పోదూరి కనకభూషణం వందన సమర్పణ చేశారు. శ్రీ పోదూరి జోగయ్య కూడా ప్రసంగించారు.

# ఉపాధ్యాయులకు పింఛను

## గన్నవరంతాలూకా సంఘ విజ్ఞప్తి

గన్నవరం, ఏప్రిల్ 16: మద్రాసు రాష్ట్రప్రభుత్వం అమలు జరిపిన విధంగా ఉద్యోగ విరమణానంతరం ఉపాధ్యాయులకు ఉపకారవేతనమిచ్చే పద్ధతిని ప్రవేశపెట్టమని 1939 లో నిర్ణయించిన పాఠ్యాంశాల క్రమణికను మార్చి కొత్తదాన్ని తయారు చేయించమని ప్రభుత్వాన్ని కోరుతూ ఇటీవల ఇక్కడ జరిగిన సమావేశంలో గన్నవరం తాలూకాబోర్డు ఉపాధ్యాయుల సంఘం తీర్మానించారు. సమావేశానికి శ్రీ కె. రాధాకృష్ణరావు అధ్యక్షత వహించారు. కార్యదర్శి వార్షిక నివేదికను సమావేశం ఆమోదించిన తరువాత శ్రీయుతులు టి. మృత్యుంజయశాస్త్రి, టి. రాజారావు, టి. వెంకటేశ్వర్లు, టి. వి. సుబ్బారావు, జె. యజ్ఞనారాయణశాస్త్రి, ఎమ్. కోటేశ్వరరావు, పి. వెంకటేశ్వర్లుగారలు ప్రసంగించారు.

హయ్యర్ గ్రేడ్ నుంచి సెకండరీ గ్రేడ్ కు మారిన ఉపాధ్యాయులందరికి సెకండరీ గ్రేడ్ జీతాలను ఇప్పించమని అభ్యర్థించుతూ ఒక తీర్మానం చేశారు. 24-9-51 తర్వాత క్రమబద్ధం చేసిన ఉపాధ్యాయులం దరిని ఖాయం చేయమని కోరుతూ వేతనాలు గ్రేడులు ఇవ్వాలని

లింగాల గిత్తలకు యిచ్చారు. శ్రీ గుంటి వెంకటేశ్వర్లు హాస్యప్రసంగమిచ్చారు. శ్రీమతి అనపాజు ఇంద్రకాంతమ్మ పక్కా బాయి హరికథాకాలక్షేపం చేశారు. శ్రీ ఎం. నారాయణాచారి ద్వితీయ పంచవర్షప్రణాళిక అమలు పరచటంలో ప్రజల సహకారం కోరారు. చిల్లకంటి పూర్ణచంద్రరావు గారు యీ సప్తాహ ఉత్సవాల నిమిత్తం చేసిన విరాళములు, ఖర్చులు చదివి, వందనములు చెప్పారు.

నరసాపురంతాలూకా ప్రాథమికోపాధ్యాయ మహాసభ

నరసాపురం, ఏప్రిల్ 16: నరసాపురంతాలూకా ప్రాథమికోపాధ్యాయ సంఘం ప్రథమ మహాసభ శ్రీ చెన్నుపాటి లక్ష్మయ్య అధ్యక్షతన ఇటీవల జరిగింది. ప్రతినిధుల సమావేశంలో కార్యదర్శి శ్రీ దంతులూరి సత్యనారాయణరాజు వార్షిక నివేదిక సమర్పించారు. సభ్యుల అనుమానాలకు శ్రీ లక్ష్మయ్య సమాధానాలు చెప్పారు.

మహాసభకు వచ్చిన సందేశాలను శ్రీ చింతాదీక్షితులు చదవారు. శ్రీ కొనకొలను వెంకట శ్రీరామమూర్తి సభను ప్రారంభించారు. ఆతిథ్యాతి శ్రీ టి. వెంకటనారాయణ ప్రసంగించారు. సంఘానికి ఈదిగువ కార్యవర్గం ఎన్నికైనారు: అధ్యక్షుడు-శ్రీ ఆర్. రామమూర్తి; కార్యదర్శి-శ్రీ డి. సత్యనారాయణరాజు; మరి 5 గురు కార్యవర్గ సభ్యులను చేర్చుకోవాలని తీర్మానించారు.

లోక తీర్మానం చేశారు. ఒక్కొక్క ఉపాధ్యాయునికి పగటుప 30 మంది విద్యార్థులు కాక 20 మంది ఉండే వీర్పాటు చేయించమని జిల్లాబోర్డువకు విజ్ఞప్తి చేస్తూ మరొక తీర్మానంచేశారు.

తాలూకా సంఘానికి ఈదిగువ కార్యవర్గం ఎన్నికైనారు: అధ్యక్షుడు- శ్రీ ఎ. వెంకటరాఘవ; ఉపాధ్యక్షుడు- శ్రీ జె. యజ్ఞనారాయణశాస్త్రి; కార్యదర్శి శ్రీ వి. యస్. ఆర్. కె. శర్మ; సహాయ కార్యదర్శి-శ్రీ డి. సుందరం; శ్రీ పి. హెచ్. వి. సుబ్బయ్య వందన సమర్పణచేశారు.

# పంచాయతీ వారోత్సవం

మినవిల్లూరు, ఏప్రిల్ 16: పంచాయతీ వారోత్సవ సందర్భంలో మొన్న కోరుమిల్లి, కొండేపాడు, మినవిల్లూరు, లలో సభలు జరిగాయి. శ్రీయుతులు పుట్టా సుబ్బారావు, ప్రత్తి శేషయ్య, పంచవర్ష ప్రణాళికలు, గ్రామస్థుల కర్తవ్యాలు వివరించారు.

కడప

కడప తాలూకాలోని పంచాయతీ దారులు చెన్నూరు పంచాయతీ ఆవరణలో యీ నెల 16న సమావేశమై పంచాయతీ వారోత్సవం జరిపారు. శ్రీ ఆర్. రాజగోపాల రెడ్డి అధ్యక్షత వహించారు.

శ్రీ యన్. యన్. రామస్వామి పంచాయతీ రాజ్య ప్రాముఖ్యం వివరించారు. పాశ్చాత్య సంబంధంమూలంగా యిది క్రమేపీ ఎలా క్షీణదశ నందుతున్నదీ తెలిపారు. మహాత్ముడు దీని పునరుద్ధారణమే ఎలా పాటుపడినదీ చెప్పారు.

శ్రీ పి. సుబ్బారావు పంచాయతీ పాలన సమర్థతతో నిర్వహించాలని కోరారు. అధ్యక్షులు ప్రసంగించాక డిప్యూటీ పంచాయతీ అధికారి మాట్లాడారు.

చెన్నూరు, పాతకడప పంచాయతీలకు ప్రథమ ద్వితీయ బహుమతులు లభించాయి. శ్రీ పి. సుబ్బారాయుడు వందనసమర్పించారు.

### ఫిలిం డైరెక్టరీ ప్రారంభోత్సవం

మద్రాసు, ఏప్రిల్ 17: "ఫిలిం డైరెక్టరీ"కి శ్రీ చిత్తూరు నాగయ్య యీ నెల 13న "స్టైలాడ్జి"లో ప్రారంభం చేశారు. శ్రీ సముద్రాల రాఘవాచార్యులు అధ్యక్షత వహించారు. ఈ సమాచార గ్రంథాన్ని ఇంగ్లీషులో ప్రచురించారు. దక్షిణాది సినీ పరిశ్రమ పూర్తి వివరాలు, తారలు, దర్శకులు, మొదలైన వారి పేర్లు యిందులో వున్నాయి.

శ్రీ కొంగర జగ్గయ్య ప్రసంగించారు. ప్రచురణకర్త శ్రీ యస్. దుర్గారావును అభినందించారు.

# గుత్తిలో మంచి నీటి సప్లయి

## త్వరలో పరిశీలన: మంత్రి వాగ్దానం

ఉరవకొండ, ఏప్రిల్ 15: గుత్తి రైలుస్టేషన్ సమీపంలో ఉద్యానవనానికి రేడియో భవనానికి యీ నెల 12వ తేదీ ప్రారంభోత్సవంచేస్తూ ఆ పట్టణ మంచినీటి సప్లయి పథకం విషయమై త్వరలో పరిశీలన జరిపిస్తామని స్థానిక పరిపాలనాశాఖ మంత్రి డాక్టరు ఎ. బి. నాగేశ్వరరావు వాగ్దానం చేశారు.

మంత్రికి శ్రీయుతులు సందా నారాయణప్ప, రాజా రాం నాయుడు, పంచాయతీబోర్డు అధ్యక్షులు, సభ్యులు స్వాగతం చెప్పారు.

ఉద్యానవనం ప్రారంభోత్సవసభకు శ్రీ సందా నారాయణప్ప అధ్యక్షత వహించారు. శ్రీయుతులు రాజారాం నాయుడు, జిల్లా మేజిస్ట్రేటు ప్రసంగించారు.

పంచాయతీబోర్డు కోరినట్లు గుత్తి మంచినీటి సప్లయి పథకం విషయమై త్వరలో పరిశీలన జరిపిస్తామని మంత్రి తమ ప్రసంగంలో వాగ్దానంచేశారు.

# ఆకాశవాణి

శనివారం, ఏప్రిల్ 21

విజయవాడ

ఉ॥ 6-10 స్వాగతం 6-15 ప్రసార వివరాలు 7 తెలుగు వా. 7-15 మంగళవాద్యం 7-30 బొమ్మరిల్లు 8 ఆంగ్ల వా.

మ॥ వనితా వాణి. కృష్ణదాసి సంగీత రూపకం 1-30 ఎ వలె 1-40 హిందీ వా 1-50 తెలుగు వా.

సా॥ 5-30 ఎ. కృష్ణమూర్తి నాదస్వరం 6 స్థానిక ప్రకటనలు 6-5 ప్రాంతీయ వా 6-15 గ్రామ॥ కార్యక్రమం కల్పసౌందర్యం నాగార్జున కొండ (ప్రసంగం) అభివృద్ధి కార్యక్రమాలు (రూపకం) 7 తెలుగు వా 7-15 కాటకాపరి (ఏక పాత్రాభినయము) 7-30 కల్పలత (రి) 8 పి. ఎస్. వెంకటచలం 8-30 రేడియో న్యూస్ రీల్ (ఢిల్లీ నుంచి రిలే) 8-40 ఎ. కృష్ణయ్య-నాదస్వరం 9 ఆంగ్ల వా 9-15 రాగప్రసారం-వయొలిన్ 9-30 ఆకాశవాణి 10 ప్రసారసమాప్తి.

మద్రాసు (ఎ)

ఉ॥ 6-50 స్వాగతం 6-55 కార్యక్రమం 7 వాద్య సమ్మేళనం 7-15 తమిళ వా 7-30 ఎన్ వి. పంచాపకేశన్.

మ॥ 1 వనితా వాణి (స్త్రీలకు) 1-30 (రి) 1-40 హిందీ వా. 1-50 (రి) 2 తమిళ వా. 2-10 వి వలె 2-15 ఎ. డి. ఇందిర 2-45 (రి).

సా॥ 5 పాశ్చాత్య సంగీతం (రి) 5-30 ఎన్. ముత్తుకృష్ణన్ వీణ 6.5 ప్రాంతీయ వా. 6-15 వి. విజయలక్ష్మి 7-15 తమిళ వా. 7-30 రుక్మిణీ రాజగోపాలన్ 8.30 (రి) 8.40 తమిళ ప్రసంగం 8-55 వినోద సంగీతం 9 జంత్రవాద్యసమ్మేళనం 9-15 కొత్తమంగళం శ్రీనివాసక రామలింగస్వామి కృతులు 10 పాశ్చాత్య సంగీతం (రి) 10.30 ప్రసారసమాప్తి.

మద్రాస్ (బి)

ఉ॥ 7 తెలుగు వా. 7-15 ఉదయగానము 7-30 బొమ్మరిల్లు, 8 ఆంగ్ల వా.

మ॥ 1 గీతమాలిక, 1-30 ఆంగ్ల వా. 1-40 (రి) 1-50 తెలుగు వా. 2 వీణ 2-15 పిల్లల కార్యక్రమం (రి).

సా॥ 5 పిల్లలకు (ఆం) 5-30 ఎ వలె 5-50 స్థానిక ప్రకటనలు 6 ఆంగ్ల వా. 6-15 ప్రాంతీయ వా. 6.30 గ్రామ కార్యక్రమం 7 తెలుగు వా. 7-15 కాటకాపరి (ఏక పాత్రాభినయము) 7-30 ఎ వలె 8 తమిళ నాటిక, 8-30 రేడియోన్యూస్ రీల్ (ఢిల్లీ) 8-40 నవ్య సాహిత్యము - కథానిక (ప్రసంగం) 8-55 వినోద సంగీతం 9 ఆంగ్ల వా. 9-15 మద్రాస్ రాష్ట్రాభివృద్ధి ప్రణాళికలు (ఆంగ్ల ప్రసంగం) 9-30 వి. గోవిందస్వామి నాయకర్ - వయొలిన్ పాలఘాట్ మంజు గి - మృదంగం విల్వాద్రి అయ్యర్ - ఘటం 10-30 ప్రసార సమాప్తి.

హైదరాబాద్

ఉ॥ 6-50 సుప్రభాత్ 6-55 కార్యక్రమం 7 తెలుగు వా. 7-15 జె. నటరాజన్ 7-45 కన్నడ వా. 8 ఆంగ్ల వా. 8-15 హిందీ వా. 8-30 గీత్, ఘజల్ 8-45 భజన్.

మ॥ 12-30 (రి) 12-50 మరాఠి వా. 1 జయలక్ష్మి నారాయణ్ 1.30 (రి) 1-50 తెలుగు వా.

సా॥ 5-30 ఎం. కనకదుర్గాంబ-గీతావళి 5-45 ఉపద్రష్ట కృష్ణమూర్తి-వయొలిన్ 6 కన్నడమున కార్యక్రమం 6-30 దాసర కృతిగళు (రి) 6-40 స్థానిక ప్రకటనలు 6-45 గ్రామసీమ అష్టపదులు-ఎ. నాగేశ్వరరావు 7 తెలుగు వా. 7-15 గ్రామసీమ 7-45 గీత్, ఘజల్ 8 యంత్రసహాయంతో వ్యవసాయం (ఆంగ్ల ప్రసంగం) వి. సుబ్బరాజు 8-15 భజన్ 8-30 గీత్ 8-45 ఘజల్ 9 ఆంగ్ల వా. 9-15 ఉర్దూ వా. 9-30 వాద్యసమ్మేళనం 9-45 సావన్ మహమూద్-స్వరమండల్ 10 జె. నటరాజన్ 10-30 ప్రసార సమాప్తి.

# పుష్కరాలలో అన్నదానం

## కలపవర్తకుల వితరణ

రాజమండ్రి, ఏప్రిల్ 16: పుష్కరాల సందర్భంలో వచ్చే నెలలో ఇక్కడికివచ్చే యాత్రికులకు రోజుకు వెయ్యి మందికి చొప్పున నెల రోజులు భోజన సౌకర్యం ఇస్తామని వ్రాసిన జాబును నిన్నటి సమావేశంలో స్థానిక సేవాసంఘం పరిశీలించి అందుకు సమ్మతించి కృతజ్ఞత ప్రకటించారు. సమావేశానికి జిల్లా సెషన్సుజడ్జి శ్రీ టి హెచ్. ఎం. సదాశివయ్య అధ్యక్షత వహించారు.

సేవాసమాజం ఆధ్వర్యాన పుష్కరాలలో రోజుకు వెయ్యిమంది యాత్రికులకు భోజనసౌకర్యం ఏర్పాటుచేయ దలచామని రాజమండ్రి కలపవర్తకులు వ్రాసిన జాబును కార్యదర్శి శ్రీమతి వి. లక్ష్మీసుబ్బారావు సమావేశంలో చదివారు. అందుకు కృతజ్ఞతను కార్యదర్శి ద్వారా కలపవర్తకులకు తెలియచెయ్యాలని తీర్మానించారు. ఈ సందర్భంలో జనుపరిరచదగు కార్యక్రమాన్ని రూపొందించి వచ్చే సమావేశములో ఆలోచనంగా ఈ యేర్పాటును ఆమోదిస్తారు. శ్రీ సదాశివయ్య దంపతులు, శ్రీయుతులు దామెర్ల వెంకటరావు, ఇ. పార్థసారథి స్వామి, పి. హనుమంతరావు, శ్రీమతి వి. లక్ష్మీ సుబ్బారావు, శ్రీ మద్దూరి హనుమంతరావు నిన్నటి సమావేశంలో పాల్గొన్నారు.

# క్రీడారంగం

## కర్నూల్ గోల్డ్‌కప్ ఫుట్‌బాల్

### తొలి పోటీలో హజారి ఫుట్‌బాల్ క్లబ్ గెలుపు

కర్నూలు, ఏప్రిల్ 18: కర్నూలు గోల్డుకప్ ఫుట్‌బాల్ టూర్నమెంటు పోటీలు మొన్న ఇక్కడి మునిసిపల్ హైస్కూలు గ్రవుండ్సులో ప్రారంభమయినవి. తొలి పోటీలో హైదరాబాద్ హజారీ ఫుట్‌బాల్ క్లబ్బు సికిందరాబాద్ సెంట్రల్ రైల్వేస్ జట్టుతో డ్రా చేసింది (2-2) నిన్న ఈ రెండుజట్లూ తిరిగి పోటీ చేయగా హైదరాబాద్ జట్టు ఒక్క గోలు తేడాతో (4-3) గెలుపు సాధించింది.

మొన్నటి ఆటలో సెంట్రల్ రైల్వే వాలా అవకాశాలను-రెండుసార్లు గోలు చేసే అవకాశాలను-జారవిడుచుకున్నది. మొదటి సగంలో ఎవరూ గోలుచేయ లేదు. రెండో సగంలో హైమూద్ హైదరాబాద్ తరఫున మొదటి గోలు చేశాడు. సికిందరాబాద్ తరఫున దేవదాస్ ఒక గోలుచేసి సమానం చేశాడు. హజారీ క్లబ్బు తరఫున శ్యామ రెండో గోలు చేయగా, మళ్ళీ దేవదాస్ బదులు దెబ్బ తీశాడు. సికిందరాబాద్ గోల్ కీపర్ రామస్వామి ఎంతో సామర్థ్యం ప్రదర్శించాడు.

నిన్నటి ఆటలో కూడా సెంట్రల్ రైల్వే జట్టు గోలుచేసే అవకాశాలను జారవిడిచింది. హజారీ క్లబ్ తరఫున శ్యామ 2, హైమూద్ 1, షకూర్ 1 గోలులు చేశారు. సికిందరాబాద్ క్లబ్ తరఫున దేవదాస్ 2, ఒస్లీ 1 గోలులు చేశారు.

హజారీ క్లబ్:—అఫ్జల్ (గోల్) సజ్జన్‌లాల్, సర్దార్ ఆలీ, గఫూర్, మొహిదీన్, నిస్సార్, ముస్బాల్, హైమూద్ జూనియర్, అమప్ ఖాన్, శ్యామ, ఏ. హైమూద్.

సికిందరాబాద్ సెంట్రల్ రైల్వే: పి. రామస్వామి (గోల్), డి. నారాయణ, జె. పి. శంకర్రావు, ఎ. హరి, రాజలింగం, ఎన్. వేణుగోపాల్, ఎస్. ఒస్లీ, రియాజ్ అహ్మద్, దేవదాస్, యెల్లయ్య మలప్ప.

### నరసాపురం హైస్కూలు ఆటల పోటీలు

నరసాపురం, ఏప్రిల్ 15: మిషన్ హైస్కూలు వార్షిక ఆటల పోటీలలో గెలుపొందిన విద్యార్థులకు మిస్ట్రెస్ డి. బి. బర్టు నిన్న బహుమతులు పంచిపెట్టారు. సభాధ్యక్షుడు మిస్టరు డి. బి. బర్టు పాఠశాల అభివృద్ధికి ఉపాధ్యాయుల కృషిని ప్రశంసిస్తూ మాట్లాడారు. పి. అళందరాజు బి. ఆజరయ్య గారలు అభినందనలు తెలియజేశారు.

ఆటల పోటీలలో మొదటి స్థానాలు పొందినవారు.

సీనియర్లు

100 మీ॥ పరుగు—మీర్ ఫజల్ హుస్సేన్, ఎమ్. వెంకట్రావు, కె. కామేశ్వరరావు.

లాంగ్ జంప్—ఇ. అప్పారావు పి. చంద్రశేఖరరావు, ఎమ్. ఎ. గఫర్

హాప్ స్టెప్ జంప్—ఇ. అప్పారావు ఎమ్. ఎ. గఫర్, మీర్ ఫజల్ హుస్సేన్.

మైలు పరుగు—జి. సంపత్ రావు, ఇ. అప్పారావు, మీర్ ఫజల్ హుస్సేన్.

షాట్ ఫుట్—పి. వెంకట్రావు, కె. చంద్రశేఖరరావు, ఇ. అప్పారావు.

డిస్కస్ త్రో—పి. వెంకట్రావు, కె. చంద్రశేఖరరావు, ఎమ్. ఎ. గఫర్

హైజంప్—ఎస్. సత్యనారాయణ కె. చంద్రశేఖరరావు, ఇ. అప్పారావు

400 మీ. పరుగు-యి. అప్పారావు, ఆర్. ఫజల్ హుస్సేన్, జి. సంపతిరావు.

ఈత-యి. అప్పారావు, ఎమ్. ఎ. గఫర్, ఎస్. సత్యనారాయణ.

ఇంటర్మీడియేట్

100 మీ. పరుగు-డి. డేవిడ్ రాజు, వి. ఆశీర్వాదము, డి. వి. రెడ్డి.

లాంగ్ జంప్-డి. డేవిడ్, ఆశీర్వాదము, డి. జార్జి.

హాప్ స్టెప్ జంప్-డి. డేవిడ్ రాజు, వి. ఆదినారాయణమూర్తి వి. ఆశీర్వాదము.

ముప్పావు మైలు-డి. వి. రెడ్డి, కె. లక్, పి. జర్మియా.

షాట్ పుట్-వి. వర్జిల్, పి. జర్మియా, వి ఆశీర్వాదము.

డిస్కస్ త్రో-డి. జార్జి, కె. లక్ జి. నరసింహారావు.

400 మీ. పరుగు-డి. వి. రెడ్డి, డి డేవిడ్ రాజు, వి. ఆదినారాయణమూర్తి.

ఈత-పి. జర్మియా, కె. ఎర్నెస్టు పాల్, పి. వీరబ్రహ్మం.

జూనియర్లు ఎ:

100 మీ॥ పరుగు—ఎస్. బుద్ధుడు, పి. భాస్కరరావు, పి. ముత్యాలరావు.

లాంగ్ జంప్—ఎస్. బుద్ధుడు, పి. భాస్కరరావు, పి. ముత్యాలరావు.

హైజంప్—పి. భాస్కరరావు,పి. ముత్యాలరావు, ఎస్. బుద్ధుడు.

ఈత—ఎ. బలరామమూర్తి, ఆర్. డేనియల్, పి. సుందరరావు.

పెద్ద తరగతుల జూనియర్ల ఈత—జె. వీరభద్రుడు, పి. నరసింహాచార్యులు, పి. వెంకటేశ్వరరావు.

జూనియర్లు

100 మీ॥ పరుగు—ఇ. ప్రభాకరరావు, ఎ. బుద్ధుడు, ఎస్. డి. హాప్ మియా.

లాంగ్ జంప్—ఎ. అబ్రహామ్ లింకన్, ఇ. సుందరరావు, పి. ఉదయ భాస్కరరావు.

హాప్ స్టెప్-మీర్ అబ్దుల్ హుస్సేన్ ఎమ్. డి. ఖాదర్ వలీ, పి. హెచ్. సుబ్బారావు

బంగారు గుండు పరుగు విరటం-యి. ప్రభాకరరావు, ఎ. బుద్ధుడు, హై. మూర్తి.

200 మీ. పరుగు-ఎ. అబ్రహామ్ లింకన్, ఎమ్. డి. హాదుమియా, మీర్ అబ్దుల్ హుస్సేన్.

నాన్ సీనియర్లు

100 మీ. పరుగు-జె. కుటుంబరావు కె. శ్యామ్‌జయరావు, సి. సుందర్.

లాంగ్ జంపు-జె. కుటుంబరావు, కె. శ్యామ్‌జయరావు, బి. సత్యనారాయణ.

హైజంప్-జె. కుటుంబరావు కె. శ్యామ్‌జయరావు, ఆర్. డేనియల్.

బంగారుగుండు విరటం-కె. శ్యామ్‌జయరావు, జె. కుటుంబరావు, ఎమ్.డి. అబ్దుల్ కరీమ్.

షాట్ పుట్-ఎమ్. డి. అబ్దుల్ గఫర్, ఎమ్. ఎ. కరీమ్, వి. సి. హెచ్. ప్రభాకరరావు.

200 మీ. పరుగు-ఆర్. డేనియల్, జె, కుటుంబరావు, ఎమ్. డి. అబ్దుల్ గఫర్. (స్వ. వి.)

### విజయవాడ క్రికెట్

విజయవాడ, ఏప్రిల్ 16: విజయవాడ, ఆదివారము 15-4-56 తారీఖున ఎ. పి. టి. ఇ. సి. మైదానమునందు "విజయా" క్రికెట్ క్లబ్బువారు 'ఆంధ్ర వ్యాయామ కళాశాల' జట్టువారు జరిగిన క్రికెట్ మ్యాచినందు 'విజయా' క్రికెట్ క్లబ్ 84 పరుగుల తేడాతో విజయము పొందినది.

స్కోరు వివరములు

విజయా క్రికెట్ క్లబ్ 171 పరుగులు 8 వికెట్లకు డిక్లేర్ చెయ్యగ జి. రామకృష్ణారావు 78, దాసు 62 పరుగులు. వై. శంకరశాస్త్రి 61 పరుగులకు 5 వికెట్లు, శర్మ 74 పరుగులకు 3 వికెట్లు నష్టపరిచారు.

ఆంధ్ర వ్యాయామ కళాశాలజట్టు: 87 పరుగులు వై. శంకరశాస్త్రి 22 పరుగులు, రాజగోపాల్ 20 పరుగులుచేసిరి వి. సత్యరాజగోపాల్ 30 పరుగులకు 8 వికెట్లు నష్టపరిచారు.

# పంచాయతీల ఎన్నికలు

కోనకొండ్ల, ఏప్రిల్ 14: కోనకొండ్ల గ్రామపంచాయతీకి ఈ క్రింది సభ్యులు ఎన్నికైనారు: శ్రీయుతులు ఓటూరు విరూపాక్షగౌడ, 2. బాకల అనుమంతప్ప, 3. మాణిక్యంసుంకప్ప, 4. శ్రీమతి సుంకమ్మ, 5. పాటీలు మల్లనగౌడ, 6. బి. గురుపాదప్ప, 7. హెచ్. లింగనగౌడ, 8. ఎల్. వెంకటరమణప్ప, 9. ఎల్. రామకృష్ణప్ప, 10. టి. మహమ్మద్ సాహెబ్ గార్లు. అధ్యక్షుడుగా శ్రీ హెచ్. లింగనగౌడ, ఉపాధ్యక్షుడుగా శ్రీ ఎల్. రామకృష్ణప్ప ఎన్నికైనారు.

### సంతవురిటి గ్రామ పంచాయతీ

శ్రీకాకుళం, ఏప్రిల్ 14: చీపురుపల్లి తాలూకా సంతవురిటి గ్రామ పంచాయతీకి పోటీలేకుండా ఈ దిగువ సభ్యులు ఎన్నికైనారు. శ్రీయుతులు వాండ్రంగి సత్యనారాయణ పట్నాయక్, బాలబొమ్మ వెంకట స్వామి, బత్తుల రాములు, బాలబొమ్మ సత్యనారాయణ, ఆదిరెడ్డి సూర్యనారాయణ కంచరాన విష్ణుమూర్తి నాయుడు, బంకాల అక్కలనాయుడు, చిత్తారపు తవిటయ్య గారలు.

### కోడూరు

బాపట్ల, ఏప్రిల్ 15: బాపట్ల తాలూకా కోడూరు గ్రామ పంచాయతీకి ఈ దిగువ సభ్యులు పోటీలేకుండా ఎన్నికైనారు. శ్రీయుతులు ఉయ్యూరు వెంకటరామయ్య, అన్నంపూడి వెంకటరామయ్య, అన్నం చెన్నయ్య, మహమ్మద్ ఇబ్రహీమ్, గనికంటి రామగోపాలకృష్ణయ్య, బిల్లా సంగీతరావు గారలు.

### తిరుత్తని పంచాయతీ

తిరుత్తని, ఏప్రిల్ 17: తిరుత్తని పంచాయతీబోర్డుకు ఈ దిగువ సభ్యులు ఎన్నికైనారు:

శ్రీయుతులు టి. వద్యాపురి, ఎస్. సుబ్రహ్మణ్యం, కె. దురయ్యశెట్టి, కె. నాయుడు, వి. వీరాస్వామి రెడ్డి, సి. జగదీశ్వరమొదలి, టి. శివనయ్యర్, వి. కె. శేషగోపాచారి, మునిలామణి, లోకనాథం శెట్టిగారలు.

అభ్యర్థుల నిరర జాబితా తయారు చేయటంలో జరిగిన పొరపాటువల్ల 6వ వార్డు ఎన్నికను ప్రభుత్వం తాత్కాలికంగా నిలిపివేశారు.

